

శ్రీమతే రామానుజాయ నమః

# న్యాసతిలకమ్



శ్రీ తల్పగిరి రంగనాథస్వామి, నెల్లూరు




'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అ౹ఴగ శింగరాచార్యులు

సమర్పణ: మొలుగు వేంకటాచార్య, తిరుచానూరు

వంగల వేంకట కేశవ అయ్యంగారు

# న్యాసతిలకమ్

అవతారిక:

న్యాసదశకం, న్యాసవింశతి అనే స్తోత్రాలవలె ఈ స్తుతికూడా ప్రపత్తిని వివరిస్తున్నది. కాని, ఆ రెండిటి కంటే ఇది కొంచెం విస్తృతమైనది. న్యాసశబ్దంతో వ్యవహరిపబడే ప్రపత్తికి కల గొప్పతనాన్ని తెలుపుతున్నందున దానికి తిలకంవంటిది (తిలకంవలె శోభను కలిగించేదిఅనే అర్థంలో ఈ స్తుతికి న్యాసతిలకమనే పేరు కలిగింది. ముఖంలోని అందాన్ని ప్రకాశింపజేసేది తిలకమేకదా! దీనికీ పేరును దేశికులే స్వయంగా పెట్టారు. ఇందులో 32శ్లోకాలున్నాయి. ఈ స్తోత్రం శ్రీరంగనాథుని ఉద్దేశించి రచించబడింది.

ఇందులో లక్ష్మీదేవి చేసే పురుషకారం, ప్రపత్తికి దివ్యదంపతులిద్దరు లక్ష్యం కావడం, భగవానుని సౌలభ్యం, అతడు చేసే మహోపకారాలు, ప్రపత్తి గొప్పతనం, ప్రపత్తి చేసేవారు ఉండవలసిన స్థితి, ప్రపత్తికూడా భక్తియోగంవలె బ్రహ్మవిద్య అనే విషయం, ప్రపత్తికి కల అంగాలలో మహావిశ్వాసానికి కల ప్రాముఖ్యం, ఆచార్యనిష్ఠకు కొన్ని ఉపమానాలు, ప్రపత్తిని చేసేవారు అన్యదైవాలను ఆశ్రయించకపోవడం, వారు తమ రక్షణభారాన్ని భగవానునివద్ద సమర్పించి, మోక్షంకోసం ఎదురు చూడడం మొదలైన పలు ముఖ్యమైన అంశాలు ఇందులో వివరింపబడ్డాయి.

1) **గురుభ్యస్తద్గురుభ్యశ్చ నమోవాకమధీమహే,**
**వృణీమహే చ తత్రాద్యౌ దమ్పతీజగతాం పతీ॥**

మన ఆచార్యులకు వారి ఆచార్యులకు నమస్కారవచనాన్ని పలుకుతున్నాము. ఆ ఆచార్యపరంపరలో మొదటివారు, లోకాలకు నాయకీనాయకులై ఉండే దివ్యదంపతులను ఉపాయంగా ఆశ్రయిస్తున్నాను.

**2) ప్రాయః ప్రపదనే పుంసాం పౌనఃపున్యం నివారయన్,**
**హస్తశ్శ్రీరఙ్గభర్తుర్మామవ్యాదభయముద్రితః ||**

చేతనులు ప్రపత్తిని పలమార్లు చేయడాన్ని నివారిస్తున్నట్లుగా తోచే అభయముద్రను కల శ్రీరంగనాథుని శ్రీహస్తం (కుడిచేయి)నన్ను రక్షించాలి.

**3) అనాదేర్నస్సీమ్నో దురితజలధేర్యన్నిరుపమం,**
**విదుః ప్రాయశ్చిత్తం యదురఘుధురీణాశయ విదః 1**
**తదారమ్భే తస్యా గిరమవదధానేన మనసా,**
**ప్రపద్యే తామేకాం శ్రియమఖిలనాథస్య మహిషీమ్ ||**

అనాది అయినది, అంతు లేనిది అయిన పాపసముద్రానికి ఏ ప్రపత్తిని సాటి లేని ప్రాయశ్చిత్తంగా శ్రీకృష్ణునియొక్క, శ్రీరామునియొక్క అభిప్రాయాన్ని తెలిసినవారు గ్రహిస్తున్నారో, ఆ ప్రపత్తిని ఆరంభించేటపుడు ఆ లక్ష్మి పలికే మాటలను నిశితంగా గమనించే మనస్సుతో(ఆమె పురుషకారాన్ని అర్థిస్తూ) నేను భగవానుని సాటి లేని పట్టమహిషి అయిన ఆ లక్ష్మిని శరణు పొందుతున్నాను.

**4) మహేన్ద్రాగ్నావిష్ణుప్రభృతిషు మహత్త్వ ప్రభృతివత్,**
**ప్రపత్తవ్యే తత్త్వే పరిణమిత వైశిష్ట్య విభవామ్ 1**
**అధృష్యత్వం ధూత్వా కమితురభిగమ్యత్వ జననీం,**
**శ్రియంశీతాపాఙ్గామహమశరణో యామి శరణమ్ ॥**

తన కాంతుడైన భగవానుని అధృష్యత్వాన్ని (ఎవరూ దగ్గరకు చేరడానికి వీలు కాని స్వభావాన్ని)పోగొట్టి, సులభంగా ఆశ్రయించడానికి తగిన స్వభావాన్ని కలిగిస్తున్నది, మహేంద్ర, అగ్నావిష్ణు –ఇత్యాది సందర్భాలలోవలె ప్రపత్తికి లక్ష్యమైన భగవానుడనే తత్త్వంతో సదా కలసి ఉండే గొప్పతనాన్ని కలిగినది, చల్లని కటాక్షాలను కలిగినది అయిన లక్ష్మిని వేరు ఏ శరణం లేనివాడనై నేను శరణు పొందుతున్నాను., (యాగంలో ఉచ్చరింపబడే మహేంద్రపదంలోని మహా, ఇంద్ర–అనే రెండు పదాలు ఇంద్రుడనే ఒకే వ్యక్తిని బోధిస్తాయి. ఆ విధంగానే, ఒక యాగంలో అగ్ని, విష్ణువు అనే ఇద్దరికి కలిపి హవిస్సు ఇవ్వబడుతుంది. వేర్వేరుగా కాదు. ఆ విధంగానే, ప్రపత్తి చేసేటపుడు, లక్ష్మీనారాయణులను కలిపే ప్రపత్తి చేయాలి. వేరు వేరుగా కాదు.),

5) స్వతస్సిద్ధ■శ్యమానమితగుణభూమా కరుణయా,
విధాయ బ్రహ్మాదీన్వితరతి నిజాదేశమపి యః ।
ప్రపత్త్యా సాక్షాద్వా భజనశిరసా వాఽపి సులభం,
ముముక్షుర్దేవేశం తమహమధిగచ్ఛామి శరణమ్ ॥

స్వతః సిద్ధమైనవాడు, అంతు లేని మహిమను కలవాడు, శ్రీదేవిని ఏ సమయంలోను విడచి ఉండనివాడు అయిన భగవానుడు కరుణతో బ్రహ్మ మొదలైన దేవతలను సృష్టించి, వారికి తన ఆజ్ఞారూపాలైన వేదాలను ఉపదేశిస్తున్నాడు. నేరుగా ప్రపత్తితో కాని, భక్తియోగాన్ని అంగిగా కల ప్రపత్తితో కాని అతడు సులభంగా పొందదగినవాడు. ఆ దేవేశుని మోక్షార్థిని అయిన నేను శరణంగా ఆశ్రయిస్తున్నాను.

6) వృన్దానియస్స్వవశయవ్రజసున్దరీణాం
బృన్దావనాన్తరభువాం సులభో బభూవ ।

**శ్రీమానశేష జనసఙ్గ్రహణాయ శేతే**
**రఙ్గే భుజఙ్గశయనే స మహో భుజఙ్గః ॥**

ఎవడు బృందావనప్రదేశాలలోని అందమైన గోపికలసమూహాలను తన వశం చేసికొని, అందరికి సులభుడయ్యాడో, (భక్తుల విషయంలో)గొప్ప ఆ కాముకుడు, లక్ష్మితో కూడినవాడై, అందరిని మంచి దారిలో పెట్టి, తన దగ్గరకు చేర్చుకోవడంకోసం శ్రీరంగంలో శేషుడనే పడుకపై శయనించి ఉన్నాడు.

**7) రఙ్గాస్తీర్ణ భుజఙ్గపుఙ్గవవపుః పర్యఙ్కవర్యం గతౌ,**
**సర్గస్థిత్యవసానకేలి రసికౌ తౌ దమ్పతీ నః పతీ ।**
**నాభీ పఙ్కజశాయినః శ్రుతిసుఖైరన్యోన్య బద్ధస్మితౌ,**
**డిమ్భస్యామ్బుజసమ్భవస్యవచనైరోంతత్సదిత్యాదిభిః ॥**

శ్రీరంగంలో(తన శరీరాన్ని)విస్తరించుకొన్న ఆదిశేషుని దేహమనే గొప్ప పడుకపై ఉన్నవారు, సృష్టి, స్థితి, లయాలనే లీలలో ఆసక్తిని కలవారు, నాభీపద్మంలో ఉండే బ్రహ్మ అనే శిశువు చెవులకు తీయనివి అయిన "ఓమ్ తత్ సత్" మొదలైన వాక్కులతో ఒకరినొకరు చూచుకొంటూ చిరునవ్వు నవ్వుకొనేవారైన ఆ దివ్యదంపతులు మనకు నాథులు.

**8) ఘనకరుణారసౌఘభరితాం పరతాపహరాం,**
**నయనమహచ్ఛటాం మయి తరఙ్గయ రఙ్గపతే ।**
**దురిత హుతాశనస్ఫురిత దుర్దమ దుఃఖమషీ,**
**మలినితవిశ్వసౌధ దురపహ్నవ వర్ణసుధామ్ ॥**

శ్రీరంగనాథా! గొప్ప కరుణ అనే జలప్రవాహంతో నిండినది, దుఃఖాలను పోగొట్టేది, పాపమనే అగ్నిచేత పుట్టిన, తీర్చడానికి సాధ్యం కాని దుఃఖమనే మసితో మలినమైన లోకమనే సౌధానికి ఆ మసిని తొలగించి, అందంగా చేసే సుధ (సున్నం)వంటిది అయిన నీ నేత్రాలనుండి వెలువడే కాంతిపుంజాలను నామీద కెరటాలు కెరటాలుగా ప్రవహింపజేయాలి.

**9) దుర్మోచోద్భటకర్మకోటినిబిడోఽప్యాదేశవశ్యః కృతో,**
**బాహ్యైర్నైవ విమోహితోఽస్మి కుదృశాం పక్షైర్నవిక్షోభితః ॥**
**యో మాహానసికో మహాన్ యతిపతిర్నీతశ్చ తత్పౌత్రజాన్**
**ఆచార్యానితిరజ్గధుర్య మయి తే స్వల్పావశిష్టో భరః ॥**

శ్రీరంగనాథా! విడిపించడానికి సాధ్యం కాని, క్రూరమైన కోట్లసంఖ్యలోని కర్మలచే బంధింపబడినా, నీ ఆజ్ఞకు లోబడినవాడనుగా నేను చేయబడ్డాను. వేదబాహ్యుల మతాలకు చెందినవారివల్ల నేను మోహాన్ని పొందలేదు. వక్రబుద్ధిని కల మతాలవారు చేసే వాదాలవల్ల నా మనస్సు కలుషితం కాలేదు. గొప్ప మహిమను కలవారు, శ్రీరామానుజులకు మహానసకైంకర్యాన్ని చేసినవారైన కిడాంబి ఆచ్చాన్ అనే ఆచార్యవర్యుల పౌత్రుల కుమారులైన ఆత్రేయ రామానుజాచార్యుల వారివద్ద(అప్పుళ్ళార్ వద్ద) చేర్చబడ్డాను. (ఆశ్రయించాను.)ఈ కారణాలవల్ల నా విషయంలో నీకుండే బాధ్యత కొంచెంగానే మిగిలి ఉన్నది. (సులభమైనది)

**10) ఆర్తేష్వాశుఫలా తదన్య విషయేఽప్యుచ్ఛిన్న దేహాన్తరా,**
**వహ్న్యాదేరనపేక్షణాత్తనుభృతాం సత్యాదివద్వ్యాపినీ 1**

శ్రీరఙ్గేశ్వర యావదాత్మనియత త్వత్పారతన్త్ర్యోచితా,

త్వయ్యేవ త్వదుపాయధీరపిహిత స్వోపాయభావాऽస్తు మే ॥

శ్రీరంగనాథా! ఆర్తుల (వెంటనే పరమాత్మను చేరి, కైంకర్యాన్ని చేసికోవాలనే చాలా ఆతురతను కలవారి)విషయంలో శీఘ్రంగా ఫలాన్ని ఇస్తున్నది, మిగిలినవారి విషయంలో మరు జన్మను పోగొడుతున్నది, అగ్నికార్యం మొదలైనవి లేనందున నిజాన్ని పలకడం మొదలైనవానివలె అందరికి అనుష్ఠించదగినది, జీవుడున్నంతవరకు అతనికి నియతంగా ఉండే నీకు పరతంత్రుడై ఉండడమనే స్వభావానికి తగినది, ప్రాప్యుడవైన నీవే ఆ ప్రాప్యానికి ఉపాయంగాకూడా కావాలి –ఆనే ప్రార్థనారూపమైన ప్రపత్తి అనేది "అదే ముఖ్యమైన ఉపాయ"మనే భావన లేనిదై నాకు కలగాలి.

11) త్వయ్యాచార్యైర్వినిహితభరాస్తావకా రఙ్గనాథ,

త్వత్కైఙ్కర్యప్రవణమనసస్త్వద్గుణాస్వాద మత్తాః ।

త్వయ్యేకస్మిన్నపి విజహతో ముక్తవత్సాధనత్వం,

త్వచ్ఛేషత్వస్వరస రసికాస్సూరయో మే స్వదన్తామ్ ॥

శ్రీరంగనాథా! , తమ ఆచార్యులద్వారా రక్షణభారం సమర్పింపబడినవారై, అందువల్ల నీ అభిమానానికి పాత్రులై, నీ కైంకర్యంలోనే అభినివేశాన్ని పొందిన మనసును కలవారై, నీ కల్యాణగుణాల ఆస్వాదంచేత గొప్ప ఆనందాన్ని పొందినవారై, ముక్తిని పొందినవారివలె నీలోకూడా ఉపాయమనే భావాన్ని విడచినవారై, నీకు దాసులై ఉండడంలోనే సహజమైన ఆనందాన్ని పొందేవారైన మహనీయులు నాకు ఇష్టులు కావాలి.

12) కల్పస్తోమేऽప్యపాస్త త్వదితరగతయోऽశక్తి ధీ భక్తిభూమ్నా,
రజ్గేశ ప్రాతికూల్య క్షరణపరిణమన్నిర్విఘాతానుకూల్యాః 1
త్రాతారం త్వామభేద్యాచ్ఛరణవరణతోనాథ నిర్విఘ్నయన్తః,
త్వన్నిక్షిప్తాత్మరక్షాంప్రతి రభసజుషః స్వప్రవృత్తిం త్యజన్తి ॥

స్వామీ! శ్రీరంగనాథా! అశక్తి, నమ్మకం, భక్తి –అనే వీటి ఆధిక్యంవల్ల ఇక రాబోయే పలు కల్పాలలోకూడా నీవు తప్ప ఇంకొక గతి లేనివారై, నీకు ప్రతికూలమైనవానిని చేయనివారై, పరిణతిని పొందే, అడ్డు లేని అనుకూలమైన కార్యాలను చేయడంలో నిష్ఠను కలవారై, రక్షకుడవైన నిన్ను మీరలేని ప్రపత్తితో ఏ విఘ్నం లేకుండా ఉండేటట్లు చేయబడినవారై, ఫలాన్ని పొందాలనే త్వరను కలవారైనా, నీ సన్నిధిలో తమ సమర్పింపబడిన రక్షణభారాన్నిగూర్చి మళ్ళీ తమ ప్రయత్నాన్ని విరమిస్తారు. (ఇంకొకసారి ప్రపత్తిని చేయరు)

13) త్యక్తోపాయ వ్యపాయాంస్తదుభయకరణే సత్రపాన్సానుతాపాన్,
భూయోऽపి త్వత్ప్రపత్త్యాప్రశమిత కలుషాన్వన్త సర్వంసహస్త్వమ్
రజ్గిన్! న్యాసాన్తరజ్గాఖిల జనహితతాగోచర త్వన్నిదేశే,
ప్రీతి ప్రాప్త స్వవర్ణాశ్రమశుభచరితాన్ పాసి ధన్యాననన్యాన్ ॥

శ్రీరంగనాథా! ఫలాంతరాలను ఇచ్చే కామ్య కర్మలను, పాపకర్మలను విడచిపెట్టి, ఆ రెండు విధాలైన కర్మలను చేయవలసివస్తే సిగ్గుపడేవారై పశ్చాత్తాపాన్ని కలవారై, ఆ విధంగా ఆ కర్మలను చే సినందున ప్రాయశ్చిత్తప్రపత్తిని చేసేవారై, దానివల్ల పాపాలు తీరినవారై, ప్రపత్తిని ఉద్దేశ్యంగా కలిగినది, జనులందరికి హితాన్ని కలిగించడంలోనే దృష్టిని కలగినదైన నీ ఆజ్ఞను ఆచరించడంలో ప్రీతివల్ల ప్రాప్తించిన తమ తమ వర్ణాశ్రమాలకు తగిన శుభకర్మలను చేసేవారై, దేవతాంతరాలను,

ఫలాంతరాలను తలవనివారైన భాగ్యవంతులను అన్నిటినీ సహించేవాడవైన నీవు రక్షిస్తున్నావు. ఆశ్చర్యం!

14) శోకాస్పదాంశ మథనః శ్రయతాం భవాబ్ధౌ,
రాగాస్పదాంశ సహజం న రుణత్సి దుఃఖమ్ ।
నో చేదమీ జగతి రఙ్గధురీణ భూయః
క్షోదిష్ఠభోగరసికాస్తవ న స్మరేయుః ॥

శ్రీరంగనాథా! శరణు పొందినవారికి సంసారసముద్రంలో మరుజన్మవల్ల దుఃఖాన్ని కలిగించే కర్మాంశను లేకుండా చేసే నీవు ఆశను కలిగించే కర్మల భాగంవల్ల వారికి సహజంగా వచ్చే దుఃఖాన్నిమాత్రం నీవు తొలగించవు. లేకపోతే (ఆ దుఃఖాన్నికూడా నీవు తొలగిస్తే)లోకంలో మళ్ళీ వీరు చాలా అల్పమైన విషయాలలో ఆశను కలవారై, నిన్ను భావించరు.

15) హేతుర్వైధే విమర్శే భజనవదితరత్ కిన్త్వనుష్ఠానకాలే,
వేద్యత్వద్రూపభేదో వివిధ ఇహ సతూపాయతాన్యానపేక్షా ।
రఙ్గిన్ ప్రారబ్ధభఙ్గాత్ఫలమధికమనావృత్తిరుక్తేష్టివత్స్యాత్,
నానాశబ్దాది భేదాత్ప్రపదనభజనే సూచితే సూత్రకారైః॥

శ్రీరంగనాథా! విధినిగూర్చి విచారిస్తే, భక్తియోగంవలె వేరొక ఉపాయమైన ప్రపత్తికూడా ఫలసాధనమవుతున్నది. అయితే విధిని ఆచరించేటపుడు భావించవలసిన నీ రూపభేదాలు(విలక్షణమైన గుణాలు) భక్తియోగంలో పలు విధాలు. ఈ ప్రపత్తిలో అయితే, ఆ గుణం వేరు దేనినీ అపేక్షించని ఉపాయమై ఉండడమే. (నీవు నిరపేక్షోపాయమని భావించడమే) భావించాలి. ఫలాన్ని ఇవ్వడం

ఆరంభించిన కర్మలకు ప్రపత్తివల్ల నాశం కలుగుతున్నందున కలిగే ఫలం భక్తియోగంవల్ల కలిగే ఫలంకంటే అధికం. శాస్త్రాలలో ఇంకొకసారి ప్రపత్తి చేయనక్కరలేదని చెప్పబడడం యాగవిషయంలోవలె చెప్పబడిందని భావించాలి. (ఒక ఫలంకోసం చేయవలసిన యాగం ఒకమారు చేస్తే చాలు –అని అనడంవంటిది)బ్రహ్మసూత్రకారులైన వ్యాసమహర్షిచే "క్రియాపదాలు మొదలైనవాని భేదంవల్ల భక్తి, ప్రప్రపత్తులు వేరు వేరని సూచింపబడింది.

16) భక్త్యా రఙ్గపతే యథాఖలు పశుచ్ఛాగాదివద్వేదన
ధ్యానోపాసన దర్శనాదివచసామిచ్ఛన్త్యభిన్నార్థతామ్ ।
వ్యక్త్యైక్యాచ్ఛరణాగతి ప్రపదన త్యాగాత్మ నిక్షేపణ
న్యాసాద్యేషు తథైవ తన్త్రనిపుణైః పర్యాయతా స్మర్యతే ॥

శ్రీరంగనాథా! యాగంలో పశు, ఛాగశబ్దాలవలె భక్తియోగంలోకూడా వేదనం, ధ్యానం, ఉపాసనం, దర్శనం మొదలైన శబ్దాలకు ఒకే అర్థాన్ని ఇచ్చే స్వభావాన్ని ఏ విధంగా తెలుపుతున్నారో, అ విధంగానే శరణాగతి, ప్రపదనం, త్యాగం, ఆత్మనిక్షేపణం, న్యాసం మొదలైన శబ్దాలలోకూడా చెప్పబడే అర్థం ఒకటే కనుక, ఒకే అర్థాన్ని ఇచ్చే స్వభావాన్ని మీమాంస, వేదాంతం మొదలైన శాస్త్రాలలో నిపుణులైనవారిచే చెప్పబడింది.

17) విశ్వాసాయాస భూమ్నా న్యసనభజనయోర్గౌరవే కో విశేషః,
తత్సద్భావేఽపి ధర్మాన్తర ఇవ ఘటతే కర్తృభేదాద్వికల్పః ।
తద్భేదో రఙ్గశాయిన్నితరగతితాద్యుత్థ శోకాతిరేకాత్
సద్విద్యాథౌవికల్పస్త్వభిమతిభిదయా తేన తత్రైకరాశ్యమ్ ॥

శ్రీరంగంలో శయనించిన స్వామీ! విశ్వాసం, శ్రమ(భక్తికి శ్రమ ప్రపత్తికి విశ్వాసం)–అనే వీనిని రెండిటిని ఎక్కువగా కలిగిన భక్తి, ప్రపత్తులలో ఏది కష్టమైనది కాదు?రెండూ ఆచరించడంలో కష్టమైనవే., ఆ విధంగా రెండిటిమధ్య తేడా లేకపోయినా, మిగిలిన ధర్మాలలోవలె కర్తలలోని భేదంవల్ల భక్తిప్రపత్తులలో ఏదయినా ఒక ఉపాయాన్ని అచరించడమనేది పొసగుతున్నది. ఆ విధమైన కర్తలలోని భేదం అనేది వేరొక గతిని కలిగి ఉండకపోవడం మొదలైనవాని కారణంగా కలిగే దుఃఖాతిశయంవల్ల ఏర్పడుతున్నది. సద్విద్యాదులలో ఏదయినా ఒక విద్యను అనుష్ఠించే క్రమం అయితే, వారి వారి అభిమతాలలోని భేదంవల్ల కలుగుతున్నది. అందువల్ల ఆ బ్రహ్మవిద్యలు ఒకే రాశికి చెందినవి అవుతున్నవి.

18) ధ్రువమధికృతిభేదాత్కర్మవద్రఙ్గశాయిన్,
ఫలతిఫలమనేకం త్వత్పదే భక్తిరేకా I
శరణవరణ వాణీ సర్వహేతుస్తథాऽసౌ
కృపణ భజన నిష్ఠాబుద్ధి దౌర్బల్య కాష్ఠా II

శ్రీరంగశాయీ! యాగాదికర్మలవలె నీ చరణాలలో చేసే భక్తియోగం ఒకటే యోగ్యతలోని భేదంవల్ల పలు విధాలైన ఫలాలను ఇస్తున్నది. ఇది నిశ్చయం. ఆ విధంగానే, ఈ శరణాగతివాక్యంకూడా అన్ని ఫలాలను ఇవ్వగలిగినది. దీనిని గ్రహించకుండా, ప్రపత్తిపట్ల నమ్మకం లేక భక్తియోగాన్ని గ్రహించడమనేది కర్తలబుద్ధిదౌర్బల్యంలోని పరాకాష్ఠ. యే అవుతుంది.

19) కర్తవ్యం సకృదేవ హస్తకలుషం సర్వం తతో నశ్యతి,
బ్రహ్మేశాది సుదుర్లభం పదమపి ప్రాప్యం మయాద్రాగితి I

విశ్వాసప్రతిబన్ధిచిన్తనమిదం పర్యస్యతి న్యస్యతాం,
రఙ్గాధీశ రమాపతిత్వసుభగం నారాయణత్వం తవ ॥

శ్రీరంగనాథా! "కర్తవ్యమైన ప్రపత్తి అయితే ఒక్కసారి చేస్తే చాలు. ఆశ్చర్యం! ఆ ప్రపత్తివల్ల పాపాలన్నీ పోతాయి. బ్రహ్మారుద్రాదులచేకూడా పొందడానికి సాధ్యం కాని స్థానం నాచే త్వరగా పొందదగినది అవుతున్నది. ఇదంతా ఏవిధంగా సాధ్యం ?" అని ప్రపత్తిని చేసేవారికి కలిగే ఈ మహావిశ్వాసానికి అడ్డు అయిన సందేహాన్ని లక్ష్మీదేవికి వల్లభుడవైనందున భోగ్యమైన నీ నారాయణత్వం పోగొడుతున్నది.

20) ధీకర్మ భక్తి రహితస్య కదాప్యశక్త్యా,
రఙ్గేశ భావకలుష ప్రణతి ద్వయోక్తేః ।
మన్యే బలం ప్రబల దుష్కృతశాలినో మే
త్వన్మూల దేశిక కటాక్ష నిపాతమాద్యమ్ ॥

శ్రీరంగనాథా! ప్రబలమైన పాపాలను చేసినవాడనై, శక్తి లేనందువల్ల ఏ సమయంలోను జ్ఞానయోగాన్ని కాని, కర్మయోగాన్ని కాని, భక్తియోగాన్ని కాని చేయనివాడనై, మనస్సులో కాలుష్యాన్ని కలిగి భరన్యాసాన్ని, ద్వయోచ్చారణాన్ని చేసినవాడనైన నాకు ఆచార్యుల కటాక్షాల ప్రసరణాన్ని నీవల్ల కలిగిన మొదటి ఫలంగా భావిస్తున్నాను.

21) అన్ధోఽనన్ధ గ్రహణవశగో యాతి రఙ్గేశ యద్వత్
పఙ్గుర్నౌకాకుహరనిహితో నీయతే నావికేన ।
భుఙ్క్తే భోగానవిదితనృపః సేవకస్యార్భకాదిః,
త్వత్సమ్ప్రాప్తౌ ప్రభవతి తథా దేశికో మే దయాళుః ॥

శ్రీరంగనాథా! గుడ్డివాడు– అంధుడు కాని ఇంకొకని హస్తావలంబానికి వశుడై, ఏవిధంగా నడుస్తాడో, కుంటివాడు– నావనడుమ నిలుపబడినవాడై, నావను నడిపే నావికునిచే ఏవిధంగా తీసికొని పోబడుతున్నాడో, ప్రభువుకు సేవకుడై ఉండేవాని పుత్రాదులు ఆ ప్రభువును తెలిసినవారు కాకపోయినా, ఆ రాజు సేవకునకు ఇచ్చిన సంపదను ఏ రీతిలో అనుభవిస్తున్నారో, ఆ విధంగానే నేను నిన్ను పొందే విషయంలో కరుణాళువైన ఆచార్యులు సమర్థు లవుతున్నారు.

22) ఉక్త్వా ధనఞ్జయ విభీషణ లక్ష్యయా తే
ప్రత్యాయ్య లక్ష్మణమునేర్భవతా వితీర్ణమ్ ।
శ్రుత్వా వరం తదనుబన్ధమదావలిప్తే,
నిత్యం ప్రసీద భగవన్మయి రఙ్గనాథ ॥

భగవన్! శ్రీరంగనాథా! అర్జునుని, విభీషణుని ఉద్దేశించి నీవు పలికిన మాటవల్ల నమ్మికను పొంది, శ్రీభాష్యకారులకు నీవిచ్చిన వరాన్ని విని గ్రహించి, వారి సంబంధంల్ల మిక్కిలి గర్వాన్ని పొందిన నా విషయంలో నీవు సదా దయ చూపాలి.

23) సకృదపి వినతానాం సర్వదే సర్వదేహిని,
ఉపనిషదభిధేయే భాగధేయే విధేయే ।
విరమతి న కదాచిన్మోహతో హా హతోఽహం,
విషమవిషయ చిన్తామేదురా మే దురాశా ॥

ఒకసారి శరణు పొందినవారికి అన్ని ఫలాలను ఇచ్చేవాడు, ఉపనిషత్తులచే కీర్తింపబడేవాడు, జనుల భాగ్యమే మూర్తీభవించినవాడైన భగవానుడు చెప్పినట్లు చేసే విధేయుడైనా, విపరీతాలైన లౌకికవిషయాలకు చెందిన భావనతో నిండిన నా

దురాశ నన్ను ఏ సమయంలోను విడచిపెట్టడంలేదు. మోహంవల్ల నేను చెడ్డాను. అయ్యో!

24) యావజ్జీవం జగతి నియతా దేహయాత్రా భవిత్రీ,
త్యక్తాస్సర్వే త్రిచతురదినగ్లాన భోగా నభోగాః 1
దత్తే రఙ్గీ నిజమపి పదం దేశికాదేశకాంక్షీ
కిం తే చిన్తే పరమభిమతం ఖిద్యసే యత్పునస్త్వమ్ ॥

ఓ మనసా! , లోకంలో జీవించినంతవరకు నిశ్చయంగా దేహయాత్ర కొనసాగుతుంది. స్వర్గాది పైలోకాలకు చెందినవై, మూడు నాలుగు నాళ్ళలో నశించే భోగాలు అన్నీ విడువబడ్డాయి. శ్రీరంగనాథుడు మన ఆచార్యుల ఆదేశాన్ని ఎదురుచూచేవాడై, తన స్థానమైన పరమపదాన్ని ఇస్తాడు. మళ్ళీ నీవు దేనినిగూర్చి క్లేశపడుతున్నావో అటువంటి, గొప్పదైన ఇంకొక అభీష్టం నీకేమున్నది? అందువల్ల ఏమీ విచారించకు.

25) అపిముహురపరాధైరప్రకమ్ప్యానుకమ్పే,
వహతిమహతి యోగక్షేమబృన్దం ముకున్దే 1
మదకలుషమనీషావ్రజలేపావలేపా
అనుగుణయితుమీహే న ప్రభూనప్రభూతాన్ ॥

మాటిమాటికి చేసే అపచారాలవల్ల చలించని కరుణను కలవాడై, మహనీయుడై, ఇహపర ప్రయోజనాలను ఇచ్చేవాడైన శ్రీరంగనాథుడు నా యోగక్షేమాలను రెండిటిని కాపాడేటపుడు, మదంవల్ల కలుషితమైన బుద్ధితో

వజ్రంపూత పూసినట్లుగా వీడని గర్వాన్ని కల అల్పులైన ప్రభువులను పొగడి నాకు అనుకూలురుగా చేసికోవాలని కోరను.

26) మాతర్భారతి ముఞ్చ మానుష చటూన్ హే దేహలభ్ధైరలం,
లుబ్ధద్వారదురాసికా పరిభవైస్తోషం జుషేథా మనః ।
వాచస్సీమని రఙ్గధామని మహానన్దోన్నమద్భూమని
స్వామిన్యాత్మని వేఙ్కటేశ్వరకవేః స్వేనార్పితోఽయం భరః ॥

తల్లీ! సరస్వతీ! మానవులను పొగడే వాక్కులను విడచిపెట్టు. ఓ శరీరమా! ఇంతవరకు పొందిన యాతనలు చాలు. ఓమనసా! పిసినారుల గృహాల వాకిళ్ళలో దైన్యంగా ఉండి పొందిన, పరాభవాలతో ఇకనైనా తృప్తిని పొందు. (పొందిన అవమానాలు చాలు) అన్ని వాక్కులకు సీమాభూమియై, గొప్ప ఆనందంతో ఉన్నతంగా ఉండే గొప్పతనాన్ని కలిగినవాడై, స్వామియై, అంతర్యామియై ఉండే శ్రీరంగనాథుని సన్నిధిలో వేంకటేశ్వరకవి అనే నా యొక్క రక్షణభారం నాచేత సమర్పింపబడింది.

27) దాస్యం లాస్యవతాऽనుమత్యమనసా రఙ్గేశ్వరత్వత్పదే,
నిత్యం కిం కరవాణ్యహంన తు పునః కుర్యాం కదర్యాశ్రయామ్।
మీలచ్చక్షుషి వేల్లిత భ్రుణి మురుర్దత్తావమానాక్షరే
భీమేకస్యచిదాఢ్యకస్య వదనే భిక్షావిలక్షాం దృశమ్ ॥

శ్రీరంగనాథా! నాట్యమాడే మనస్సుతో(సంతోషంతో) నీ దాస్యాన్ని అంగీకరించి, నీ చరణాలలో సదా కైంకర్యాన్ని చేస్తాను. కన్నులను మూసికొని, కనుబొమలను ముడిచి, మాటిమాటికి అవమానిస్తూ పలికి, భయంకరుడై ఉండే

ఒక ధనికుని ముఖాన్ని చూచి, యాచించి లజ్జను పొందే స్థితిని నేను మళ్ళీ పొందను. అటువంటివానిని కంటితోకూడా చూడను.

28) త్వయ్యేకాఞ్జలి కిఙ్కరే తనుభృతాం నిర్వ్యాజసర్వంసహే,
కళ్యాణాత్మని రఙ్గనాథకమలాకాన్తే ముకున్దే స్థితే ।
స్వామిన్పాహి దయస్వ దేవ కుశలిన్ జీవ ప్రభో భావయే,
ఆలాపానవలేపిషు ప్రలపితుం జిహ్రేతి జిహ్వామమ ॥

శ్రీరంగనాథా! సహజంగానే అన్ని దోషాలను సహించేవాడవై, మంగళకరమైన తిరుమేనిని కలవాడవై, లక్ష్మీనాథుడవై, ఇహలోకపరలోక పురుషార్థాలను ఇచ్చేవాడవైన నీవు ప్రాణులకు వారు చేసిన ఒక అంజలికి కింకరుడవై ఉండగా, గర్వాన్ని కలవారివద్ద "స్వామీ! రక్షించు, దయ చూపించు, నాకు కావలసినది ఇయ్యి. క్షేమాన్ని కలవాడా! చిరకాలం వర్ధిల్లు. ప్రభూ! నన్ను నీవాడినిగా భావించు"అనే మాటలను జల్పించడానికి నాకు సిగ్గుగా ఉన్నది.

29) త్వయి సతి రఙ్గధుర్య శరణాగతకామదుఘే,
నిరుపధిక ప్రవాహ కరుణా పరిణాహవతి ।
పరిమిత దేశకాలఫలదాన్ ఫలదాకృతికాన్
కథమధికుర్మహే విధిశివప్రముఖానముఖాన్ ॥

శ్రీరంగనాథా! సహజమైన కరుణాప్రవాహంతో నిండినవాడవై, శరణు పొందినవారి కోరికలను అనుగ్రహించేవాడవైన నీవుండగా, అల్పమైన దేశంలో, కాలంలోమాత్రమే అనుభవించ దగిన ఫలాలను ఇచ్చేవారై, గొప్ప ఫలాలను

ఇచ్చేవారివలె కనుపించేవారైన ఆ బ్రహ్మ మొదలైనవారిని ఏ విధంగా ఆశ్రయిస్తాను?(ఆశ్రయించను)

30) ఓమిత్యభ్యుపగమ్య రఙ్గనృపతేఽనన్యోచితాం శేషతాం
స్వాతన్త్ర్యాదిమయీమపోహ్యమహతీమాద్యామవిద్యాస్థితిమ్ ।
నిత్యాసఙ్ఖ్యవిసీమభూతిగుణయోర్వ్యాయామనాయాసతః
సేవాసమ్పదమిన్దిరేశ యువయోరైకాన్తికాత్యన్తికీమ్ ॥

శ్రీరంగనాథా! లక్ష్మీశా! ఇతరుల విషయంలో తగని, మీకే తగిన కైంకర్యాన్ని (అనన్యోచితమైన కైంకర్యాన్ని)" ఆ విధంగానే కానీ "అని అంగీకరించినవాడనై, స్వాతంత్ర్యం మొదలైన, చిరకాలంగా ఉండే గొప్ప అజ్ఞానస్థితిని పోగొట్టినవారు, నిత్యమైన, లెక్క లేని. ఆంతు లేని ఐశ్వర్యాన్ని గుణాలను కలవారైన మీదంపతులిద్దరికే తగినది, అంతు లేనిదైన కైంకర్యసంపదను శ్రమ లేకుండా పొందుతాను.

31) ఆచార్యాద్రఙ్గధుర్యద్వయసమధిగమే లబ్దసత్త్వం తదాత్వే
విశ్లిష్టాశ్లిష్ట పూర్వోత్తరదురితభరం యాపితారబ్ధదేహమ్ ।
నీతం త్వత్కైస్త్వయావా నిరవధికదయోద్భూతబోధాదిరూపం,
త్వద్భోగైకస్వభోగం దయితమనుచరం త్వత్కృతే మాం కురుష్వ ॥

శ్రీరంగనాథా! ఆచార్యులవల్ల ద్వయమంత్రాన్ని పొందడంద్వారా స్వరూపాన్ని పొందినవాడనై అపుడే వీడిన ఉత్తరాఘభారాన్ని, నశించిన పూర్వాఘభారాన్ని కలవాడనైన నేను, ఇపుడుండే శరీరాన్ని అది పతనం చెందేవరకు గడపినవాడనుగా, నీకు చెఃదినవారిచేత, నీచేత పరమపదానికి తీసికొని

పోబడినవాడనుగా, నీ అంతు లేని కరుణతో జ్ఞానాదిగుణాలను కలవాడనుగా, నిన్ను అనుభవించడమే భోగంగా కలిగినవాడనుగా చేసి, నీకు ఇష్టమైన కైంకర్యాన్ని చేసేవాడనుగా, నీ ప్రయోజనంకోసమే ఉండేవాడనుగా చేయాలి.

**32) విధానం రఙ్గేశాదధిగతవతో వేఙ్కటకవేః**
**స్ఫురద్వర్ణం వక్త్రే పరికలయతాం న్యాసతిలకమ్ I**
**ఇహాముత్రాప్యేష ప్రణతజనచిన్తామణిగిరిః,**
**స్వపర్యఙ్కే సేవాం దిశతి ఫణిపర్యఙ్కరసికః ॥**

శ్రీరంగనాథునివల్ల ఆదేశాన్ని పొందిన వేంకటేశకవి ముఖం ద్వారా ఆవిర్భవించిన వర్ణాలను(అక్షరాలను, రంగులను)కలిగిన న్యాసతిలకమనే ఈ కృతిని ధరించేవారికి (పఠించేవారికి) –శరణు పొందినవారికి చింతామణిపర్వతమై, ఆదిశేషశయనంలో శయనించి ఆనందించేవాడైన ఈ శ్రీరంగనాథుడు ఇహలోకంలో, పరలోకంలో తన కైంకర్యాన్ని (సేవను) అనుగ్రహిస్తాడు.

న్యాసతిలకం సంపూర్ణమ్

★★★★★